# చీమలూ, పెన్నూ

**ఇద్రీస్ షా**





ఒక రోజు ఒక చీమ దారి తప్పి
ఒక కాగితం మీదకు వెళ్లింది.



ఒక పెన్ను ఆ కాగితం మీద
అందమైన గీతలు గీయటం చూసింది.



“అద్భుతం. ఇది జీవం ఉన్నదాని లాగా ఉంది,” చీమ అరిచింది.

“ఈ అందమైన ఉపరితలం మీద ఇది ఎంత వేగంగా, ఎంత బాగా గీతలు గీస్తోంది! దీని శ్రమ ప్రపంచంలోని చీమలన్నింటి శ్రమకి సమానం.



“ఇది గీస్తున్న గీతలు ఎంత అందంగా ఉన్నాయి!



“ఈ గీతలు చీమల్లాగా ఉన్నాయి.
ఒక్క చీమ కాదు,
బారులు తీరిన వేలాది చీమల్లాగా ఉన్నా !"

తాను చూసిన దానిని ఇతరులతో పంచుకోటానికి
ఆ చీమ ఉత్సాహంగా పరుగులు తీసింది.



తనకు కనపడిన మొట్టమొదటి
చీమకి ఆ విషయం చెప్పింది.



రెండవ చీమ ఆ గీతలను చూసి అంతే ఉత్తేజితం అయ్యింది. అది కనుగొన్నదానికి, దాని పరిశీలనా శక్తికి మొదటి చీమను రెండవది అభినందించింది.









అయితే మూడవ చీమ అంత ఉత్తేజితం కాలేదు. అది ఇలా అంది:

“దీనిని తీవ్రంగా, చీమ శాస్త్రీయ దృష్టితో చూడకుండా మీ ఉద్వేగాలలో పడి కొట్టుకుపోతున్నారు.

“దీనిని నా దృష్టికి తీసుకుని వచ్చారు కాబట్టి సరిపోయింది. నేను కూడా ఈ గీతలు గీస్తున్న సాధనాన్ని అధ్యయనం చేశాను.



“ఎంతో కష్టపడి, శాస్త్రీయ, చీమ ఆధారిత పరిశోధన ద్వారా ఈ గీతల వెనక పెన్ను ఒక్కటే లేదని తెలుసుకున్నాను.

“పెన్ను తోపాటు ఇంకా చాలా
ఉన్నాయన్న విషయాన్ని మీరు
గమనించారా?



“ఆ మిగిలిన వస్తువులే పెన్నుకి శక్తిని ఇస్తున్నాయన్న శాస్త్రీయ నిర్ధారణకి నేను వచ్చాను.



“కాబట్టి, పెన్నుకి ఈ శక్తిని ఇస్తున్నదే ఈ గీతలకు కారణం."





ఆ విధంగా ఆ చీమల గుంపు

ముందుగా వేళ్లను కనుగొన్నాయి.





శాస్త్రీయ పరిశోధన ఎలాంటిదంటే తమ
అవగాహన పరిధిని పెంచటానికి మరొక
చీమ పూనుకుంది.

వేళ్లను మరింతగా అర్థం
చేసుకోటానికి అది వాటి మీదకు
పాకింది.



పరిశోధించే చీమలు అలాగే చేస్తాయి.



అక్కడంతా తిరిగిన తరవాత వేళ్లన్నీ
కలిసి చెయ్యి అవుతున్నాయన్న
నిర్ధారణకు అది వచ్చింది.





తాను కనుగొన్నదానిని ఇతరులతో
పంచుకోటానికి పరుగులు తీసింది.



తనకి ఎదురైన మొదటి
చీమకి ఆ విషయం
చెప్పింది.



చెయ్యి వివరణ విన్న కొత్త చీమ ఎంతో ఉత్తేజితం అయ్యింది. దాని చీమ పరిశీలన శక్తికి, కనుగొన్నదానికి అభినందించింది.



కాలం గడుస్తున్న కొద్దీ చీమల అవగాహన
పరిధిని పెంచటానికి చీమ తరవాత చీమ
ఎంతో కృషి చేశాయి.





అరచెయ్యి ముంజేతిలో భాగం
అని ఒక చీమ కనుగొంది.



ఈ ముంజెయ్యి ఒక శరీరంలో భాగమని మరొక చీమ కనుగొంది.



నిజానికి ఒక చెయ్యి కాకుండా రెండు చేతులు ఉన్నాయని మరొక చీమ కనుగొంది.



చేతులే కాకుండా కాళ్లు కూడా ఉన్నాయని చీమలు కనుగొన్నాయి. అయితే ఈ కాళ్లు ఏమీ రాయవు.



పరిశోధన ముందుకు సాగిన కొద్దీ రాతకి సంబంధించి ఎన్నో విషయాలను చీమలు కనుగొన్నాయి.



ఈ పరిశోధనలు పూర్తిగా శాస్త్రీయమైనవి కావటంతో అసలు రాసినది ఏమిటో చీమలు ఎన్నటికీ అర్థం చేసుకోలేకపోయాయి...



ఇంత జరిగిన తరవాత చీమలను ఒక పదం చదవమంటే. . .

. . . లేదా ఆ గీతలు ఏం చెప్పటానికి ప్రయత్నిస్తున్నాయని అడిగితే. . .

. . . అవి తెల్ల మొహం వేస్తాయి . . .





. . . చీమల సమగ్ర పరిశోధన గురించి
మీకు ఏమీ అర్థం కాలేదని అంటాయి.

